శౌర్యములు నీకు నీవారికి నెక్కుడగు నెఱిఁగి యెఱిఁగి మామాటఁ జెడచెవిఁ జెక్కితివి. ఆత్మకోపంబు లరసి దేశకాలజ్ఞుఁడై వ్యవహరించు రాజు స్థిరప్రజ్ఞుఁడనఁబడి శ్రేయస్సు గాంచును.

శ్రేయస్కరంబు నెఱిఁగి హితాహితము లుపదేశించినను వినని వాఁడాపదల పాలుపడకుండునా ? నీవు మనస్సును నీవశమున నుంచు కొనలేక దుర్యోధనవశుఁడవై చరించి కులనాశంబు గావించితివి. ఇంత యనర్థకమునకు నీలోభంబె కారణంబు అపరాధివి నీవయ్యు నితరులపై నేల కోపపడెదవు? పాంచాలిని సభలోన క్లేశించిన దుర్మార్గుండు ప్రతి జిహీర్షువగు భీమసేనునిచేఁ జంపఁబడెను. నీవును దురాత్ముఁడగు నీకొడుకును నిరపరాధులగు పాండవుల విడనాడిన యతిక్రమంబుఁ దలఁపుము.

అనిన ధృతరాష్ట్రుండును నీవు చెప్పినది సత్యము, పుత్రశోక వేగంబున మతిచెడి యట్లు కావింపఁబూనితినని పశ్చాత్తప్తుఁడయ్యె. తవల నందఱుఁగలసి రణభూమిఁ బ్రవేశించిరి. వ్యాసదత్త దివ్యదృష్టిచే గాంధారి మృతపుత్రాదులఁగని విలపించి తుదకుఁ గృష్ణునిఁగని యిట్లనియె.

కృష్ణా ! కురుపాండవు లట్లు పరస్పరజిఘాంసువులై ప్రవర్తించు చుండ నీవేల యుపేక్షించితివి? నీవిది వారింప శక్తుఁడవు. విపుల బలుఁడవు. బహు భృత్యుఁడవు. వాగ్మివి. సమర్థుండవు. కౌరవనాశము వలయుననియే యుపేక్షించితివి. కావున దీని ఫలమనుభ వింపుము. పతిశుశ్రూషచేత నేను గొంచెము తపశ్శక్తి నార్జించి యునా చక్రగదాధరా! నిన్ను శపించుచున్నాను. బంధువులగు కౌరవ పాండవులు పరస్పరము చంపుచుండ నుపేక్షించితివి. కావున నీవు నేఁటికి ముప్పదాఱవయేఁట నిట్లే నీ బంధువులనెల్ల వధింపఁగలవు. నీవు హతసుతబాంధవామాత్యుఁడవై వనచరుఁడవై యనాథువలె బహుకుత్సితుండవై జనరహితస్థలంబునఁ గుత్సితోపాయంబున జావఁగలవు. నీయాఁడువారును నిహతసుతజ్ఞాతిబాంధవులై యీ భారతస్త్రీలవలె రోదింపఁగలరు. అనినఁ గృష్ణుండు చిఱునవ్వుతో నామె కిట్లనియె.

గాంధారీ! యాదవులను వధింపఁగలవారు లోకమున నేనుదప్ప మఱి యెవ్వరు లేరు. ఇది నే నెఱుఁగుదు. దానినిగావింప నేనును యత్నము చేయుచున్నాఁడను. నీవు శపించి కష్టార్జితంబైన తపస్సు నాశపఱిచికొంటివికాని యంతకుమించి యేమియుఁ జేయఁజాలవైతివి. యాదవులు దైవోపహతులు. నిస్సంశయము. యాదవులను నేనే వధింతును. వారిలో వారు కలహించి చావకుండిన దేవదావులకైన వారవధ్యులు. అని కృష్ణుం డిట్లు వచింపఁ బాండవులు గుండెలు తట తట కొట్టుకొనఁ దమ బ్రతుకులపై నాశలుమానిరి. *

అవల వ్యాసాదులు గాంధార్యాదుల శాంతిపఱిచిరి. ధర్మరాజాదు లౌర్ధ్వదైహికక్రియ లాచరించిరి.

గద్యము.

శ్రీ రామచంద్ర

చరణారవింద మిళిందా

యమాన మానసత్వ మహోన్నై

భవ వావిలికొలను రామచంద్రరాయ

తనూభవ సుజనవిధేయ సుబ్బరాయ నామ

ధేయ ప్రణీతంబైన శ్రీ కృష్ణలీలామృ

తంబను మహావచన ప్రబంధ

మున భూభారహరణలీల

యను ద్వితీయ

చుళుకము.

శ్రీరామార్పణమస్తు

---

* మునులు యాదవులను శపించుట భారతయుద్ధమునకుఁ బూర్వకార్యమని యాంధ్రభారతమం దలి

గీ. మున్న కాదె యాదవులకు మునివరేణ్య। కలిత దారుణ శాపంబు గలదు; నీవు
నేల చర్విత చర్వణ మిట్లు సేయ ? । దీన నీచేసి త్రెవ్వితి దానిఁ జెపుము.

అని కృష్ణ వాక్యమువలన నేర్పడుచున్నదిగాని మూలంబున దీని కాధారంబు గానరాదు. ఈ సందిగ్ధ విషయంబు వేఱొకచోటఁ జర్చితము.